Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] మద్రాసు : 1942 వ సం॥ మార్చి నెల 6 వ తేది శుక్రవారం [సె 9 రు.

## "దౌర్జన్యమును ప్రతిఘటించు రాజ్యాలతో చేరుడు"

## భారతదేశానికి చీనా అధ్యక్షులగు చాంగ్ కాయిషేకు సలహా.

భారతీయ ప్రజలకు చీనా సర్వ సేనాధిపతి చాంగ్ కాయి షేక్ గారు ఒసంగిన సందేశం యీ దిగువ రీతిగలదు :—

నేను ఇండియాలోనున్న రెండు వారములందును, దురాక్రమణకు గడంగు శత్రువులను నిరోధించు సమిష్టి యత్నముల గూర్చి ఉన్నత సైనికాధికారుల తోను, సివిలు అధికారుల తోను నా భారతీయ మిత్రులతోను సమగ్రంగా చర్చించుటకు అవకాశం కలిగింది. అన్ని విషయాలలోను పరస్పరసానుభూతి ఏకాభిప్రాయం వారికి నాకు కలిగినందుకు నేను సంతసించుచున్నాను. నేను వెడలిపోవలసియున్నది గావున మీ సెలవు గైకొని వెళ్లదలచితిని. నాయెడలను, నా భార్యయెడలను మీరు చూపిన దయాదరణములకు యింపుమూలకంగా కృతజ్ఞత చెప్పుచున్నాను. నేను దేశములో కొద్దికాలమే యుండుటచేత భారతీయప్రజలకు చెప్పదలచినదంతయు చెప్ప వీలులేకపోయింది. ఇపుడు మీవద్ద సెలవుగైకొనుచు యీ సందేశం తెలుపుచున్నాను.

భారతదేశము అభివృద్ధి కావలెనను వాంఛ నాకు గాఢముగ నున్నది. అది నా హృదయపూర్వకమగు వాంఛ. ఈ మాటలు నా హృదయ కహరాలలోనుండి వచ్చుచున్నవి.

దురాక్రమణలను ప్రతిఘటించుటకు భారత ప్రజలందరు కృతనిశ్చయులైయున్నారని నేను తెలిసికొని అపరిమితానంద మొందుచున్నాను.

**చీనా - భారతదేశముల సభ్యత.**

చీనా భారత దేశముల జనాభా ప్రపంచ జనాభాలో సగము వంతుండును. ఈ రెండు దేశాల మధ్య సరిహద్దులు 1,800 మైళ్లుండును. రెండు వేల సంవత్సరములనుండియు భారతదేశమునకును, చీనాకును వాణిజ్య వైజ్ఞానిక సంబంధములుండెను. ఈ రెండు వేలేండ్లలో ఒకసారైనను యీ రెండు దేశములకు యుద్ధం జరగలేదు. ఇట్టి స్నేహము అపూర్వము. ఇంత కాలం మిత్రులుగానున్న యిరుగుపొరుగు రాజ్యాలు ప్రపంచంలో మరెక్కడ లేవు. మన రెండు దేశాల ప్రజలు శాంతి కాములనుటకు యిది ప్రబల నిదర్శనం.

ఈనాడు రెండు దేశాల క్షేమము, ఆశయములు ఒక్కటిగా నున్నవి. ఈ కారణంచేత, దురాక్రమణలను ప్రతిఘటించి పోరుచున్నవారితో చేతులు కలిపి, నిజమైన ప్రపంచ శాంతి నేర్పరచుటకు పోరుట మనకు విధియైయున్నది.

ఇదిగాక న్యాయమునకు ధర్మమునకును ఆత్మత్యాగము చేయు గుణము యీ రెండు దేశాలవారికి సాంప్రదాయసిద్ధముగనున్నది.

**స్వార్థ త్యాగ లక్షణము.**

కనుక మానవకోటి విముక్తికై రెండు దేశాలవారు స్వార్థవిరహితముగా పనిచేయాలి. ఈభావముతోనే, దురాక్రమణ ప్రతిఘటించుటకై చీనా అందరి కంటే ముందు యుద్ధంలో దిగెను. ఈ యుద్దేశంతోనే దురాక్రమణల నెదిరించే దేశాలతో ప్రస్తుత యుద్ధమునందు నిస్సందేహంగా చీనా కలిసింది తన స్వాతంత్ర్యం కొరకు మాత్రమేగాక, మానవకోటి అంతకు స్వాతంత్ర్యం సాధించు నుద్దేశంతో చీనా యుద్ధంలో దిగింది.

మన రెండు జాతుల నాగరికతా చరిత్రయందు క్లిష్ట పరిస్థితులేర్పడిన యీ సమయమునందు, మానవకోటి అంతటి స్వాతంత్ర్యమునకు మనం శక్తివంచన లేక పాటుబడవలెనని సోదర భారతీయులకు సూచింప సాహసించుచున్నాను. స్వాతంత్ర్య ప్రపంచమునందే చైనీయులు భారతీయులు తమ స్వాతంత్ర్యమును బడయగలరు. అంతేకాక, చీనా-ఇండియాలలో దేనికి స్వాతంత్ర్యం నిరాకరింపబడినా ప్రపంచంలో నిజంగా శాంతి యుండనేరదు.

ప్రస్తుతం ప్రపంచంలో రెండు పక్షాలు కలవు. ఒకటి దురాక్రమణలచేయు పక్షము, రెండోది దురాక్రమణల నెదిరించువారి పక్షము.

**ప్రపంచంలో రెండే పక్షాలు.**

దురాక్రమణల నెంతమాత్రం సహించనివారును, తమ దేశ స్వాతంత్ర్యం ప్రపంచ స్వాతంత్ర్యం వాంఛించువారును దురాక్రమణ ప్రతికూల పక్షంలో చేరవలెను. మూడో పక్షమునకు చోటులేదు. వేచియుండుటకు వ్యవధిలేదు. మానవకోటి భవిష్యత్తు నిర్ణయమగుచున్న విషమసమయమిది. ప్రస్తుత తగదా ఒక దేశమునకుగాని, ఒక మనిషికిగాని సంబంధించినదికాదు. రెండు దేశాలమధ్య పరిష్కారము కావలసియున్న సమస్యలకు సంబంధించినదిగూడ కాదు. కనుక దురాక్రమణల ప్రతిఘటించువారితో చేరి పోరుచున్నవారు ఆయాదేశములతో మాత్రమే చేరినట్లుగాక అందరికి తోడ్పడుచున్నట్లగును.

జాతీయతత్వ చరిత్రయందు పసిఫిక్ యుద్ధము మార్పు తెచ్చిపెట్టు ప్రధాన ఘట్టమని నమ్ముట కిదియే కారణము.

**ఇండియా విధి నిర్వహించాలి.**

స్వాతంత్ర్యము సాధించుటకు యిదివరకు అనుసరించు పద్ధతులు వేరు. ఇప్పుడు అనుసరించు పద్ధతులు వేరు. ప్రపంచ స్వాతంత్ర్యం కాపాడుటకు జరుగుచున్న యీ యుద్ధములో భారతదేశం తన బాధ్యత నిర్వహించునని దురాక్రమణ నెదిరించు దేశాలవారు ఆశించుచున్నారు.

తనకు స్వాతంత్ర్యం కావలెనని భారతీయులు కోరుచున్న కోర్కెయెడల ప్రపంచ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు సంపూర్ణ సానుభూతికలదు. ఈ సానుభూతి అమూల్యమయినది, రూపాయి అణాపైసలలో విలువకట్ట వీలులేనిది. కావున యీ సానుభూతి పోకుండ భారతీయులు చూచుకోవలెను.

ప్రస్తుత సమరము స్వేచ్ఛకు బానిసత్వమునకు, ధర్మమునకు, అధర్మమునకు, నాగరికతకు అనాగరికతకు, జరుగుచున్న యుద్ధము. దురాక్రమణ ప్రతికూలురు ఓడిపోయినచో, యీ ప్రపంచ నాగరికత నూరు సంవత్సరములు వెనుకకు పోవును. మానవుల కష్టములకు అంతమే యుండదు

**ఒక హెచ్చరిక.**

ఏషియా ఖండంలో జపాను సైనికాధికారులు చేయుచున్న క్రూరకార్యాలు మాటలతో వర్ణింప వీలులేదు.

ఫర్మోజా, కొరియాలు జపానువశమయినప్పటినుండి అచటి ప్రజలు పడుచున్న కష్టాలు యితరులకు హెచ్చరికలుగ నుండగలవు.

మేము నిరోధం ప్రారంభించినప్పటినుండి జపాను చీనాలో చేయుచున్న ఘోర కార్యాలకు లెక్కలేకుండనున్నది. 1937 లో నాంకింగు నగరమును జపాను పట్టుకొన్నపుడు ఒక్కవారంలో ఒక లక్షప్రజను వారు చంపివేసిరి. ఐదేండ్లనుండి స్వతంత్ర చీనాలో ప్రతిరోజు విమానాలనుండి బాంబులు వేస్తున్నారు. జపాను ఆక్రమించిన చోట్లల్ల ఫిరంగులు కాల్చుచు పురుషులను స్త్రీలను పిల్లలను నిర్దాక్షిణ్యంగా కొట్టుచున్నారు లేదా చంపుచున్నారు.

**జపాను క్రౌర్యం.**

విద్యార్థులను యువకులను ప్రత్యేకంగా ఎంచికొనుచు హింసించుచున్నారు. ఇంతేకాదు, విద్యానిలయములను, చరిత్ర ప్రాముఖ్యతగల వస్తువులను, జీవనాధారములగు వస్తువులను, నాగళ్లు పశువులు మున్నగువాటిని, తీసుకపోవుటో లేక నాశనమో చేస్తున్నారు. మానభంగములు, హత్యలు, ఇండ్లు కాల్చుట మున్నగునవి లెక్కలేనన్ని జరుగుచున్నాయి. జపాను అధికారుల పరీకుతో నల్లమందు దుకాణములు, జూదపుకొట్లు, వ్యభిచార గృహములు స్థాపించి దేశములను నిర్వీర్యుల కొనర్చి పాడుచేయుచున్నారు. ప్రపంచంలో దౌర్జన్యానికి గడంగిన యింకే రాజ్యంకూడ అనుసరింపనంత క్రౌర్యం జపానువారనుసరిస్తున్నారు. విదేశీయులుచూసి చెప్పినవారివల్ల తెలిసిన అనేక ఘోరాలలో కొన్నిమాత్రం ఇచట తెలుపబడినవి.

**నాగరికత రక్షణకే.**

రాక్షసత్వము పశుత్వము వృద్ధి నొందిన యీ సమయమున చీనావారును సోదర భారతీయులును మానవ స్వాతంత్ర రక్షణకుగాను, నాగరికతా రక్షణకుగాను అట్లాంటికు ప్రణాళికయందు యిమిడియున్న సిద్ధాంతములకును, 26 రాజ్యాలవారు గావించుకొన్న ఒడంబడికకున్ను సంపూర్ణంగా తోడ్పడవలెను.

చీనా, ఇంగ్లాండు, అమెరికా, రష్యా మిత్రమండలి రాజ్యాలతో మనస్ఫూర్తిగ చేరి జయము కలుగువరకు పోరాడి భారతీయులు తమ విధ్యుక్తము నెరవేర్చెదరని నమ్ముచున్నాను.

**భారతదేశ స్వాతంత్ర్యం.**

మన స్నేహవర్గము నందున్న ఇంగ్లాండు, భారతదేశ ప్రజలు కోరేవరకు వేచియుండక, సాధ్యమయినంత త్వరలో వారికి నిజమయిన రాజకీయాధికారమును ఒసంగునని నేను హృదయపూర్వకముగ ఆశించుచు గాఢముగ విశ్వసించుచున్నాను.

ఇట్లు చేసినయెడల భారతీయులు తమ భౌతిక ఆధ్యాత్మిక బలమును యింకను వృద్ధిచేసికొనటయే గాక, యీ యుద్ధంలో తాము ప్రవేశించుట దౌర్జన్య ప్రతిఘటనచేయు రాజ్యాలకు తోడ్పడుటకు మాత్రమే కాదనియు, తమ దేశ స్వాతంత్ర్యపోరాటమునందు మెట్టుదాటుటకు గూడ వీలగుననియు గ్రహించ గల్గుదురు.

ఇది వివేకముతో కూడిన విధానమనియు, బ్రిటిషు సామ్రాజ్యకీర్తివ్యాప్తికి తోడ్పడు మార్గమనియు నేను నమ్ముచున్నాను" అని మార్షలు చాంగ్ కాయిషేక్ గారు తెలిపిరి.

---

# చీనా పునరుద్ధరణకు అధినేత

## జనరలు చాంగ్ కాయిషేకు దేశైక్యతకు కారకుడు

### జపానుపై యుద్ధం సాగించిన విధం.

చీనాలో మూడేండ్లు యుద్ధరంగాలలో పత్రికా విలేఖరిగా నుండిన రోడ్సు ఫార్మరుగారు యీ దిగువ వ్యాసం వ్రాసిరి :—

మార్షలు చాంగ్ కాయిషేకుగారిని యింకో గంటకు చూస్తాననగా వారి వాకటిలో జపాను బాంబొకటిపడి పెద్ద యిల్లంత గొయ్యిచేసెను. వారి బాడిగార్డులలో ఒక్కరును మిగులలేదు. కోట్లకొలది ప్రజలను చెప్పినట్లు నడిపించుశక్తిగల చాంగ్ కాయిషేకుగారు చీనా నూతనోద్యమమునకు అధినేత. వారెచటకి పోతే అచటికి జపాను విమానాలు వెంటపెడుతూ వుంటాయి.

వారి సైనిక ముఖ్యకేంద్రమగు పూచంగునందుంటిని. యాంగ్సీనది ఒడ్డున హాంకోవైపున్న దీవూరు. ఉదయం 8 గంటలు కొట్టేసరికి తలుపు తెరువబడెను. లోన సేనాని చాంగ్ కాయిషేకు దూరంగానున్న కావలా సైనికులతోపాటు విగ్రహంవలె నిలచియున్నాడు. పలుచని సుందరమైన ముఖం. ఉక్కువంటి అతని చేయి ఘట్టి కరస్పర్శ గావించెను. అతని కండ్లు నాలోనికి గ్రుచ్చుకొనుచున్నవి. అతనిలో యేదో ఉత్కృష్టమయిన మానసికశక్తి, భౌతికశక్తి యిమిడియున్నట్లు నాకు తోచెను. పొడవైన, లలితమయిన అతని శరీరం బిగువుగుండీల సైనిక దుస్తులలో యిమిడియున్నది. సౌమ్యుడు ఉత్సాహి. అతని నిర్లక్ష్యభావం అపుడే పడిన బాంబును మరపింపజేసెను.

సైనికుడగు యీ రాజనీతికోవిదుని ప్రథమ సందర్శనం మరువరానిది. నేను హాంకోనగరంలో కొన్ని నెలలపాటున్నను యింతకుముందు చాంగ్‌ను చూచియుండలేదు.

**మరువరాని సందర్శనం.**

ఆ కాలంలో ఒక డజనుమందికన్న ఎక్కువ విదేశీయులు విలేఖరులు రాజనీతిజ్ఞులు అతన్ని చూచియుండరు. పూచంగులో వారియిల్లు దిట్టమయిన కావలా కలిగియుండును. ఎవరైన మహాయోధుల అంత్యక్రియలకు పరామర్శలకు మాత్రమతడు బయటకు వచ్చుచుండును. వీధులన్నింటను పోలీసుబందోబస్తు చేయుటచే సేనాని హాకో వైపు వచ్చుచున్నారని సాయుధ సైనికులవలన తెలియుచుండును. వేలకువేలు ప్రజలు రోడ్ల ప్రక్కన గుమిగూడి వారిని ఒక్కసారి చూడనుత్సాహపడుచుందురు. కాని

ఎవ్వరును ఒక్కసారైనా చూచియుండరు. అతడింకో దారికేనా పోతాడు, లేదా, కనబడకుండా అతివడిగా సకవచ మోటారులో పోవును. చాంగును పడగొట్టువాడెవడైనా వుంటే జపాను ఎంతో బహూకరించును.

ఒకసారి అతడు యుద్ధరంగానికి విమానంపై పోగా వెంటనున్న అతని ఆరు విమానాలను 12 జపాను విమానాలు త్రోవలో యెదుర్కొన పెద్ద విమానయుద్ధం జరిగింది. చాంగుగారి విమానం అతివడిగా తప్పించుకొని, కాపు లేకుండానే వెడలిపోయింది. అట్టి శత్రుత్వపు రోజులలో యింకో దేశీయుడెవ్వడు తనెత్తు బంగారమిచ్చినా ఆ ప్రాంతానికి విమానంలో పోడు.

**అసమాన సాహాదా.**

ప్రపంచ నాయకులలో చాంగ్ కాయి షేకుగారి స్థానం అసమానమయినది. 54 సంవత్సరాలుగల యీతడు మానవకోటిలో ఐదోవంతు రాజ్యమేలుతున్నాడు. అతి దూరంగానుండి అధికారం చలాయిస్తూ వుంటాడు. అతడు తరుచు చేయు హెచ్చరికలు బహుకొద్దిమంది సైనికులు అధికారులు వింటూవుంటారు; అవి ప్రకటింపబడినచో తన ప్రజలలో నూటికి 20 మందే చదువగలరు. సాధారణంగా కనబడకుండానే, తరుచు వినబడకుండానే, చాంగ్ కాయి షేకు గారు 4000 సం॥ల చీనాదేశ చరిత్రలో ఎన్నడులేని లెక్కలేనటువంటి చైనీయ ప్రజలలో ఐకమత్యం అన్నివిధాల చేకూర్చిరి. చీనావారందరిని ఏకపతాకం క్రిందకి కలసికట్టుగ తీసుకవచ్చిరి. యూరోపులో నార్వేనుండి ఇటలీవరకు, బెల్జియము నుండి పోలండువరకు ఎన్ని చిన్నరాజ్యాలు భాషలున్నవో చీనాలో అన్నిగలవు. అటువంటి చీనాలో వీరొక్కరే ఐకమత్యం చేకూర్చగల్గిరి. చీనాలో ప్రబలియున్న ఏడుదోషాలను పారద్రోలుటకు చాంగుగారు కంకణం కట్టుకున్నారు. అవి బద్ధకం, సంకోచం, దురాశ, అనవసరనియమ ప్రతిబంధకాలు, అవినీతి, బాధ్యతతప్పించుకొనుట, లక్ష్యంతప్పుట యిత్యాది గుణాలు. దేశద్రోహాన్ని శిక్షించడంలో చాంగేగారు దాక్షిణ్యం ఏమిచూపరు. 1938 వ సం॥లో చాంగ్షానగరమునకు జపానువారు 40 మైళ్లదూరంగా నుండగానే భీతిచెంది, అచటి సేనానాయకుడు శత్రువశం కాకుండుటకై ఊరు తగులబెట్టే ఉత్తరువుచేసెను. ఆ సేనాని తన బంధువైనప్పటికి చాంగ్ కాయి షేకుగారు విచారణ చేయించి మరణదండన విధించిరి.

జపానుతో యుద్ధంనందు చాంగ్ కాయి షేకుగారి సుగుణాలన్నియు పనికివచ్చినవి.

**జపానుపై యుద్ధక్రియ.**

రాజనీతి, తెలివితేటలు, రాజకీయ పరిజ్ఞానము, పట్టుదల, ఇంగితజ్ఞానము, ఊరజ్ఞ యివన్ని చూపి విషమపరిస్థితులను దాటగలిగెను. 1937 వ సం॥ జూలై 7 వ తేదిన వారు చైనీయులందరిని ఆయుధాలుధరింప ఉత్తరువు చేసినపుడు "చీనా చివరవరకు పోరాడును. ఎంతకాలమయినా సరే, ఎన్ని కష్టాలున్నా సరే, మధ్యలో సంధికై చీనా నిలువదు" అని చెప్పెను. జపాను ఉత్తర చీనాపైబడి షాంగే నగరాన్ని కొట్టినపుడు చాంగు గారివద్ద 50,000 మందే ప్రభుత్వ సేనలుండెను. టాంకులు లేవు, కొద్ది ఫిరంగులు, 200 విమానాలుండెను.

మూడు నెలలలో చీనా పడిపోతుందని విదేశీయ విమర్శకులు అంచనా వేసిరి చాంగ్ కాయి షేకుగారు షాంగే నగరాన్ని మూడు నెలలవరకు తనవశమందుంచుకొని, జపానీయులు జయింపరానివారు కారని రుజువుచేసిరి. జపాను వారు నాంకింగు నగరాన్ని తీసుకొని ఒక నెలపాటు నానా హింసలు కలుగజేసి, దానితో యుద్ధం గెలిచితిమనుకొన్నారు. ఈ కొద్దికాలంలో చాంగు తన సేనలను తిరిగికూడదీసి, కాలవిళంబనం చేయుచు, శత్రువులను లోభాగానికి రానిచ్చుచుయుక్తిపన్నెను. శత్రువు వచ్చేలోగా ఆ ప్రాంతాన్ని కాల్చివేయుచుండెను. గోరిల్లా సైనికులు శత్రు సేనలను ప్రక్కలనుండియు, వెనుకభాగమునందు కొట్టుచూ ఆక్రమించిన ప్రాంతాలందు సుస్థిరమగు ఏర్పాటులేమి చేయజాలకుండ నిరోధించుచుండిరి. చాంగ్ కాయి షేకు ముందు శత్రు నిరోధం చేయుచు, వెనుక దేశంలో కట్టుదిట్టాలు చేయుచుండెను.

గతసారి చుంగుకింగు నగరం పోయినపుడు చాంగ్ కాయి షేకు దంపతులతో ముచ్చటించినపుడు, చాంగ్ గారు యిక తమకు ఓటమిలేదనియు, జపానుపై నిక శక్తి క్షీణించిపోయిందనియు చెప్పిరి. వారిట్లనిరి:—

"మీ విదేశీయులు యుద్ధంలో విజయం కేవలం సైనిక బలంవల్లనే చేకూరుతుందని నమ్ముతుంటారు. మరో మూడు అంత ప్రాధాన్యంగల విషయాలున్నాయి. ఆర్థికంగా మేము వారికన్న ఎక్కువరోజులు నిభాయించుకోగలం. నూటికి 90 వంతు మా ఆర్థిక విధానం వ్యవసాయంపై నాధారపడియున్నది. జపాను పూర్తిగ పరిశ్రమలపై నాధారపడియున్నది. దేశీయ వ్యవహారములందు మా ప్రజలు ఒకే సుస్థిరమగు ప్రభుత్వ విధానం క్రింద ఐకమత్యం కలిగియున్నారు. జపాను మంత్రివర్గం అపుడే ఐదుసారులు మారింది. అంతర్జాతీయ వ్యవహారములందు మాకు మహారాజ్యాలు స్నేహంగా నున్నవి. జపాన్ను అందరు అనుమానిస్తూ మిత్రులే లేరు. కావున జపాను ప్రస్తుతం ఒక్క సైనికంగా మాత్రమే తాత్కాలిక విజయం బడసెను. మేము యితర మూడు రంగాలలో స్థిరమగు విజయములను బడసియున్నాము."

చివరకు చాంగ్ కాయి షేకుగారి మాటలే నిజమని రుజువవుతుంది.

---

# చైనాకు చేయంగల విన్నపములు.

పూర్వం ఒకానొక యక్షుడు కుబేరునివద్ద నవుకరీ చేస్తూ వుండేవాడు. కుబేరుడంటే ఆ కాలంలో అంతులేని ధనంగలవాడు. ఎంత త్రవ్వి తీసినా తరుగనటువంటి నవరత్నాల గనులు అతని రాజ్యంలో వుండేవి. అతని పట్టణంపేరు అలకాపురం. అలకాపురం సంపదలకాపురం. అటువంటి అఖండైశ్వర్యవంతుడైన ఆ కుబేరుని ద్రవ్యవ్యవహారాల సందర్భంలో అతనివద్ద కొలువున్న ఆ యక్షుడు ఏదో తప్పుపని చేశాడు. ద్రవ్యరాసులు వుండేచోటనే, ఆశగాని, అజాగ్రత్తగాని వుంటుంది. ఆ యక్షుడు తప్పుపని చేసినందుకు కుబేరు డొక శాపం పెట్టాడు. అంటే, శిక్ష విధించాడు. ఆ యక్షుణ్ని కొంతకాలం దూరదేశానికి పంపించివేశాడు. దేశాంతరవాస శిక్ష విధించాడు. అని అర్థం. ఆ యక్షుడికీ, అతని భార్యకూ సమావేశంలేకుండా చేశాడు. యక్షుని భార్య అలకాపురంలోనే వుంది. యక్షుడు మాత్రం దేశాంతరవాసియై పరాయి దేశంలో ఒంటరిగా వున్నాడు. అప్పుడు ఆ యక్షుడు తన ప్రియమైన భార్యను తలుచుకొని, "హా! ప్రాణనాయకీ!" అని అపరిమితమైన భరింపరాని విరహవేదన పడినాడు. తన భార్యకు ఎవరిద్వారానైనా తన మనస్సులో వున్న ప్రేమను తెలియజేయవలెననిన్నీ, తన భార్యయొక్క క్షేమ

సమాచారములను తెలుసుకోవలెననిన్ని ఎంతో ఆశపడినాడు. అప్పుడా యక్షుడు ఏమీతోచక ఆకాశంలో పోతున్న మేఘమును చూచాడు. ఆ మేఘానికి తన సందేశం యావత్తూ తెలియజెప్పుకున్నాడు. అలకాపురం వెళ్లడానికి ఏయే కొండలు, ఏయే నదులు, ఏయే సరస్సులు దాటి ఏ త్రోవమీదుగా వెళ్లవలెనో ఆ మేఘునితో వివరించి చెప్పాడు. మానససరోవరంకూడా దాటి ఉత్తరంగా చాలా దూరం వెళ్లవలెనని చెప్పాడు. ఆ వర్ణన యావత్తూ కాళిదాస మహాకవి సంస్కృతంలో అత్యద్భుతంగా, అమిత మనోహరంగా వర్ణించి వ్రాసినాడు. ఆ గ్రంథానికి "మేఘసందేశం" అని పేరు పెట్టినారు.

ఈ మానససరోవరం కూడా దాటి యింకా ఉత్తరంగా పోతేనేగాని, అలకాపురం చేరలేము. కనుక, హిమాలయ పర్వతాలుకూడా దాటి ఉత్తరంగా పోతే, టిబెట్టు అనే దేశం వుంది. "టిబెట్టు" అనేది పూర్వం మన సంస్కృతభాషలో "త్రివిష్టపం" అనే పేరుతో పిలువబడేది. త్రివిష్టపం అంటే స్వర్గం అని అర్థము. టిబెట్టు కూడా దాటి ఇంకా కొంచెం ఉత్తరంగా పోతే, చైనా రాజ్యం వస్తుంది. మేఘసందేశంలో యక్షుడు చెప్పిన మాటలనుబట్టిచూస్తే, కుబేరుడు ఆ చైనా రాజ్యంలోనే వుండేవాడని ఊహించవచ్చు. యక్షులుండే రాజ్యం అదే అని ఊహించితే ఆక్షేపణ ఏమీలేదు. ఇప్పటి కాబూలు దేశమునే క్రీస్తు పుట్టక పూర్వము ఆర్యులు "కాంధహారదేశము" అని పిలిచేవారు. కాంధహారం అనగా "గంధర్వ" దేశమే. కాబట్టి గంధర్వులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు మొదలైనవారి దరూ హిమాలయా పర్వతాలకు ఉత్తరంగా వున్న దేశాలలో వుండేవారనిమనము సులభంగా ఊహించవచ్చు.

మన పురాణములలో గంధర్వుల పేర్లుకూడా చాలా చిత్రంగా ఉంటాయి. "హాహా" అనే గంధర్వుడు, "హూహూ" అనే గంధర్వుడు, ఉండేవారు. చైనాలో "హూపే", "హూచో" "హాంకాం" అనే ఊళ్లపేర్లున్నూ, "హూస్యాంగ్" "ఫాహియాన్" అనే మనుష్యులపేర్లున్నూ, "హొయాంహొ" అనే నది పేరున్నూ యివన్నీ చూస్తే "హాహా" "హూహూ" అనే పురాణాలలోని గంధర్వులపేర్లు జ్ఞాపకంవస్తాయి. త్రివిష్టపం అనే రాజ్యానికి చుట్టుప్రక్కల చేరువలోనే, పూర్వకాలంలో గంధర్వులు, యక్షులు మొదలైన వారందరూ కాపురం ఉండేవారని అనుకోవాలి. "కింపురుషులు" అనే మాటకు అర్థమునేమిటంటే, "కించిత్తు పురుషులు", అనగా కొంచెంగానే ఎదిగిన పురుషులుఅని అర్థం. అందువల్ల మన శాస్త్రాలలో చెప్పబడిన కిన్నరులు, కింపురుషులు చైనా దేశపు వాళ్లేయని ఊహించవలసివస్తోంది.

ఈవిషయంలో పూర్వచరిత్రాధారములను, పురాణ ప్రమాణాలను త్రవ్వి పైకి తీసికొనిరాలేదు, యక్షగంధర్వ, కిన్నర కింపురుషులయెడల ఇక్ష్వాకులనాటి కాలంలో ఎటువంటి గౌరవం ఉండేదో, అటువంటి గౌరవమే చైనావారియందు నేటి భారతీయులకుకూడా అవిచ్ఛిన్నంగా ఉంటూవున్నదని గ్రహించక తప్పదు. నేటి చైనా ప్రభుత్వాధ్యక్షుడైన చంగుకై షేకుగారు ధర్మపత్ని సమేతంగా రెండు వారాలక్రిందట చైనానుంచి విమానంమీద ఢిల్లీకి వచ్చినప్పుడు, దేవతాలోకంనుంచి మానవలోకంలోకి ఒక యక్షుడు వచ్చినట్లుగా ఒక వింతయైన ఉత్సాహానందం కలిగింది. చంగుకై షేకుగారు ఢిల్లీకివచ్చినతోడనే, వైస్రాయిగారు స్వాగతమిచ్చి తమమందిరంలో అతిథిగావుంచి అనేక సత్కారాలు చేసారు. చంగుకై షేకుగారు పండిత జవహరిలాలుగారిని తమ బసకు పిలిపించి అనేక విషయాలు ఆప్తమిత్రులులాగున మాట్లాడినారు. గాంధి మహాత్మునితోకూడా కలకత్తాలో స్వయంగా కలిసికొని మాట్లాడినారు. మహమ్మదాలీ జిన్నాగారితో మాట్లాడినారు. "భారత దేశానికి స్వారాజ్యం రావాలి. అదే నా కోరిక" అని బాహాటంగా లోకానికి చాంగుకైషేకుగారు వెల్లడించారు.

జపానులో జనసంఖ్య 9 కోట్లు—ఇండియాలోను, చైనాలోను కలిసి 85 కోట్ల జనసంఖ్య ఉంది. చైనాతో, ఇండియా ఏకమై ఒక్కటే సంకల్పంతో శత్రువును నాశనం చెయ్యాలి. "బలవంతమైన సర్పము చలి చీమలచేతజిక్కి చావదెసుమతీ?" "లెండు భారత వీరులారా! నిదుర లేవండీ"! అని చైనానుంచి చంగు కై షేకుగారు హెచ్చరిక చేస్తున్నారు. కనుక, చైనాకు మనము భారత దేశంనుంచి యీ క్రింది రీతిగా జవాబు వ్రాయవలసియున్నది. "మ.రా.రా శ్రీ చంగు కై షేకు మహాశయులకు భారతీయులు అనేక నమస్కారములుచేసి చేయంగల విన్నపములు ఏమనగా, ఉభయకుశలోపరి, శత్రువీరులను సంహరించుటకు మేము కూడా స్థిరసంకల్పులమై యున్నాము. చీనాకు యిండియాకు మధ్య మహోన్నతములైన హిమాలయ పర్వతాలు అడ్డం ఉన్నప్పటికీ, మీకును మాకునుగల పరస్పరాదరణాభిమానములను ఆ హిమాలయ పర్వతాలుకూడా అడ్డగించలేవు. ఈ శత్రు సంహారంలో కొండలైనా పిండికొట్టి ఇండియాకు చైనాకు త్రోవచేయగలం. చైనాలో ప్రజలు ఎట్లా పోట్లాడుతున్నారో ఇండియాలో ప్రజలుకూడా అట్లాగే పోట్లాడగలరు. భారతీయులకు చైనానమోనా నచ్చింది. "చైనా చేసినట్లుగా చెయ్యనా?" అని ప్రతి భారతీయుడు అంటున్నాడు. ప్రతి భారతీయుడూ, మీ మీదనే మనస్సు పెట్టుకొని, మీ యుద్ధపద్ధతినే స్మరిస్తూ యీ అమోఘ సందేశమును మీకు అందజేయుచున్నాడు. చిత్తగించవలెను. ఇట్లు, మీ మిత్రులు, భారతమాత పుత్రులు.

ఇదే చైనాకు మన మేఘ సందేశం.

---

# యుద్ధ విమర్శ.

**చీనాకు జోహారు.**

ఈ నెల 7 వ తేదిన చీనా ఉత్సవదినము ఇండియాలో జరుపవలెనని ఘనతవహించిన వైస్రాయిగారు ప్రత్యేకవిన్నపం ప్రకటించిరి. చీనా సర్వసేనాని యగు మార్షలు చాంగ్ కాయి షేకుగారు, వారి భార్య ఇండియాకు యిటీవలనేవచ్చి పోవుటచే మనకు చీనా దేశము యెడల మరింత గౌరవాభిమానములు ఎక్కువయినవి. ప్రపంచ విఖ్యాతినిబడసిన యీ దంపతులు చూపిన ధైర్యము, స్నేహభావము, తెలివితేటలు, విశ్వాసము స్వాతంత్రప్రియులందరికి ఉత్సాహం కలిగించియుండును. మార్షలు చాంగ్ కాయిషేకుగారి అత్యద్భుత జీవితమును ప్రశంసించుచు అన్ని భాషలలోను వ్యాసములు ప్రకటింపబడినవి. వారి భార్య మాధం చాంగ్ కాయిషేకు ఆమె సోదరుడు డా॥ టి వి. సూంగుగారు యిరువురు సోదరీమణులును ప్రపంచవిఖ్యాతి బడసిన వ్యక్తులు. స్వాతంత్ర్యయోధులు, సంస్కర్తలు, అక్రమ నిరోధకులు నగు వీరు చీనాప్రజల నాయకులేగాక, 26 జాతుల సమిష్టి ఆలోచనల మంత్రివర్గములందు విస్వసనీయమగు ప్రధానవ్యక్తులుగ నెంచబడు

# బాంబులు వేసే వైమానికుడు.



ఇంగ్లాండు తీరాన కాపలా కాయుచున్న విమానాలు అట్లాంటిక్ సముద్ర మార్గాలను కూడా కాస్తూ వుంటాయి. అట్టి సందర్భాలందు విమానంలో, వైమానికుడు దిగువను సముద్రంలో శత్రునౌక ఉందని అనుమానంతో బాంబులు వదులుటకు శ్రద్ధగ చూస్తున్నాడు.

---

చున్నారు. బ్రిటిషు చక్రవర్తి యిటీవలనే మార్షలు చాంగ్ కాయి షేకుగారికి ఆర్డరు ఆఫ్ ది బాతు నైటు గ్రాండు క్రాసు (కె.జి.సి.బి.) బిరుదు నొసంగిరి. అందుచే ఒకవిధంగా వారు మననాయకులైరి. భారతీయులు, బ్రిటిషువారు, చీనా వారు, అమెరికనులు, రష్యనులు, డచ్చివారు ప్రాణాలొడ్డి పోరాడుచున్న యుద్ధమునందు వారు ప్రాధాన్యత వహించుచున్నారు. మన సమస్యలన్ని వారి సమస్యలే, మన ఆశలే వారి ఆశలు, మన సంపదయే వారి సంపద కావున భారతదేశములో అందరును నేడు ధైర్యసాహసములుగల చీనా దేశమునకు వారి నాయకులకును జోహారులొనర్చి తమ సానుభూతి తెలుపుటేగాక, తమ సేవా సహచర్యములు కానుకగానిచ్చి విజయమునకు తోడ్పడవలెను.

* * *

**మంత్రివర్గం మార్పు.**

పట్టుదలతో కార్యం సాధించుటకు క్రొత్త పరిస్థితుల నెదుర్కొనుటకును మనస్సు అనుగుణ్యంగా మార్చుకొను చుండవలెనని చర్చిల్ ప్రధాని యిటీవల ఒక ఉపన్యాసంలో తెలిపియుండెను. తన మంత్రివర్గమును మార్చి క్రొత్తసహోద్యోగులను చేర్చుకొన్నప్పుడు వీరీ గుణమును బాగా ప్రదర్శించిరి.

క్రొత్తగ చేర్చుకొనబడిన వ్యక్తులలో ముఖ్యమయిన వారు సర్ జేమ్సు గ్రిగుగారు. యుద్ధ కార్యాలయమునందు స్థిరమయిన అండరు సెక్రటరీగానుండిన వీరు ఆ శాఖకు ఉన్నతాధికారిగ నియమింపబడిరి. ప్రతిభగలవారు మరుగున పడియున్నను వెదకితీయుట, పార్లమెంటు సభ్యులు కాకపోయినను సరే అట్టివారిని తెచ్చి మంత్రులుగ నియమించుట చర్చిలుగారికి క్రొత్త కాదు. వ్యాపారస్థులుగ నుండిన లెదర్సు ప్రభువు ఆలివరు లిటిలుటను గార్లను యిదివరకు మంత్రులుగ నియమించుటచే మంచి మేలు కలిగెను. సివిలు సర్వీసు ఉద్యోగిని మంత్రిగ నియమించుట అరుదే కాని ఇదివరకు బెంగాలు గవర్నరుగనుండిన సర్ జాను అండర్సనుగారిని మంత్రిగ నియమించుట చాల ప్రశంసింపబడి ఎంతో మేలు కలిగెను

సర్ జేమ్సు గ్రిగుగారు ఇండియాలోను ఇంగ్లాండులోను పరిపాలనా వ్యవహారములందు చాల అనుభవముగలవారు. కావున చాల వివాదములకు గురియగు మిగుల కష్టమయిన పరిపాలనాశాఖను నిర్వహింప వారెంతయు తగియున్నారు. వీరు ఇండియా ప్రభుత్వమునందు ఆర్థిక సభ్యులుగ నుండియుండిరి. వీరీ క్రొత్త ఉద్యోగమునందు సంస్కారములను నిర్విఘ్నముగా అమలు జరుపవచ్చును.

ఈ మార్పులు చేసినప్పుడు, "చర్చిలుగారు పై అధికారులను మార్చుటకు పరిస్థితుల నభివృద్ధిచేయుటకు పూనుకోరు" ను ఫిర్యాదులు నిరాధారములని ఋజువయినది. ఈ మార్పులు విదేశములందలి పరిస్థితుల ననుసరించే జరిగియుండవచ్చును. అయినను అధికబలం చేకూర్చుటకే ఉద్దేశింపబడినవి. అందుకు యింకా కొంత కృషి జరుగవలసియున్నది.

* * *

చర్చిల్‌వలెనే భారత దేశనాయకులుగూడ నిర్మొగమాటంగా మాట్లాడేరు. "ఇండియా ద్వారంవద్దకు యుద్ధం వచ్చింది. దినదినము వృద్ధి చెందుచున్న మిత్రమండలి శక్తి ఉపయోగపడి రక్షించుకునే పరిస్థితినుండి తిరుగు దాడి చేయగల స్థితి వచ్చేవరకు కొన్ని నెలలపాటు ఇండియా

**ఇండియా భరించగలదు.**

కూడ కష్టకాలం గడపాలి. సముద్రంలోనుండి వచ్చు దాడికి మనం సిద్ధంగా నుండాలి. ఇండియాపై నౌకా దాడికే విమానాలనుండి బాంబులదాడికేగాక, సేనలు మన తీరాన దిగుతే దాని గూడ సిద్ధంగా నుండాలి" అని భారత సర్వ సేనాధి కారిగారు అన్నారు. అవి వట్టిమాటలు కావు. ఇంగ్లీ తజ్ఞులకు అవి ఆశ్చర్యం కలిగించవు. 1942 లో అందు ముఖ్యంగా మొదటి 6 లేక 8 నెలలు సంయుక్త రాజ్యాలకు చాల గడ్డు దినాలని అందరెరుంగుదురు. వాటితో ఇండియాకూడ కొంత బాధ్యత వహించాలి. ధైర్యస్థులకు ప్రమాదమే ఒక ప్రోత్సాహంగా నుండును. కావున ఇండియాకూడ యీ బాధ్యతను ఐకమత్యంతో ధైర్యంతో ఓర్పు వహించి నిర్వహింపగలదు.

పరిస్థితులు అటునుంచి యిటు యెపుడు మారిపోతాయో చెప్పజాలం. సరిగా ఎంత సైన్యం ఎక్కడనుందో దేశరక్షణ కార్యాలు ఏమి చేసేరో తెలుసుకోవాలను అభిలాష ఇండియాలో చాలమందికి కలదు. అట్లే జపానులోగూడ అటువంటి అభిలాష ఇండియానుగూర్చి గలదు. కావున ఆ విషయాలు బయటకు చెప్పరాదు. అందుచే "క్రొత్త పరిస్థితులను ఎదుర్కొనుటకై సైనిక ఏర్పాటులన్ని జరిగినవని" సేనాధిపతి చెప్పినపుడు మనం నమ్మాలి. అంతేకాక ఇండియాలో పనిచేయుగలవారందరిపైని ప్రత్యేక బాధ్యత గలదని గుర్తించాలి. సైనిక ఏర్పాటులకు బాధ్యత గలవారికి అవసరమగు పరికరాలు చేకూర్చాలి. అందుకు సహకారంతో కృషిచేయుచు త్యాగం చేయుచున్నపుడు ఇండియా ఒంటరిగా లేదనియు, తన పక్షమున 25 రాజ్యాలున్నవనియు జ్ఞాపకముంచుకోవాలి.

ఇపుడు ఇండియాలో పరిస్థితులకన్న ఎక్కువ ప్రమాదకరమగు పరిస్థితు లేర్పడినపుడు ఇంగ్లాండులో పురజనుల సైన్యమొకటి ఏర్పాటు చేయబడినందున, ఇపుడు ఇండియాలోకూడా

**ఇండియాలో హోమ్‌గార్డులు.**

అట్లు చేయాలను సూచనలు బయలుదేరుచున్నవి. ప్రజలకేదో పని కలిపిస్తూ వుంటే భీతిచెందకుండా వుంటారు, నిజమే. కాని యీ దేశంలో ప్రజాసైన్యం (హోమ్‌గార్డు) యేర్పాటు చేయడానికి కొన్ని ప్రతిబంధకాలున్నాయి.

ఈ దేశంలో మతవైషమ్యాలు పాతుకపోయినాయి. జపాను దాడివస్తే యివి తగ్గుతాయనే సూచన లేదు. హిందూ గార్డు, ముస్లిము గార్డు అని రెండు యేర్పాటు చేస్తే యీ తగవులు మరీ హెచ్చుతాయి. ప్రైవేటు సైన్యాలను ఎంతమాత్రం ఉండనివ్వరాదు. అంతేకాక యిట్టి సైన్యాలను తయారుచేయుటకు సైనికోపాధ్యాయులు చాలరు. స్థిరమగు సైన్యంలో వారిని పనిమానిపించి యీ తరిఫీదు పనికి నియమించ వీలులేదు. పింఛను గైకొన్న సోల్జరులు ఇండియాలో అంతటా ఎక్కువమంది లేరు. స్థిరమైన సైన్యాలకు సరిపోవునన్ని ఆయుధాల సప్లై మాత్రమే ఇండియాలో గలదు. గాయాలు కలిగించే యితర విధములగు ఆయుధాలుగూడ ఇండియాలో చాల తక్కువ.

ఈ కష్ట సమయమున స్వదేశానికి సహాయంచేయగోరువారందరును, అన్ని జాతిమతాలవారును, స్వంత కార్యాలు సౌఖ్యాలు ఎంత త్యాగంచేయగలరో అంత త్యాగంచేసి, మన స్ఫూర్తిగ దేశరక్షణ సర్వీసులలో చేరుటయే ఉత్తమకార్యము.

## ఆకాశంపై గుర్తులు.

ఈ రాష్ట్రంలో సముద్రతీర ప్రాంతములందు యీటీవల తరుచు విమానాలు ఎగురుచుండుట, వాటి శబ్దం వినబడుచుండుట తెలియనివారికి గాభరా కలిగించుట చోద్యంకాదు.

అట్లా భయపడేవారికి, విస్మయం చెందువారికి విద్యావంతులగువారు చెప్పవలసిందేమంటే, అవి మన ప్రభుత్వ విమానాలే గస్తీ తిరుగుచున్నాయనియు, బర్మాపై జపానువారు దాడి చేసినందున యిపుడు తరుచు తిరుగుచున్నాయనియు, అట్లా సముద్రతీరాన రైలుమార్గంవెంటా అవి కాపలా కాయడం మనకు శ్రేయస్కరమనియు చెప్పాలి. అట్లా చెప్పితే దేశానికి సేవచేసినవారగుతారు.

మిత్రమండలి దేశాల విమానాల గుర్తు లెట్లావుంటాయో త్వరలో ప్రకటించబడును. శత్రు విమానాలు మిత్ర విమానాల తారతమ్యం తెలుసుకొనుటకు వీలగును. అపుడు ఆ దుర్గ తొలిగి తరచు తిరిగే మన విమానాలు చూచినపుడు ఆనందమే కలుగగలదు.

రష్యా ఎర్ర సైన్యం వార్షికోత్సవంనాడు స్టాలినుగారు ఒసంగిన ఉపన్యాసములో కొన్ని ముఖ్యాంశములను అందరు గమనింపదగియున్నవి. చలికాలం అంతా తీవ్ర యుద్ధం జరిపినా

**స్టాలిను కార్యవాది.**

రష్యనులు చెక్కు చెదరలేదని వారు చెప్పిరి. జర్మనులదాడి నరికట్టుటయు, వసంత రుతువులో రాబోవు జర్మను దాడి రాకుండా చేయుటయు కాక, రష్యా నేలనుండి జర్మనులను పూర్తిగ తరిమివేయుటే తమ సంకల్పమని వారు చెప్పిరి. జర్మనుల శక్తి రష్యా రంగమునందే పూర్తిగ నాశనం చేయుదుమనిరి.

జర్మను ప్రజలకును హిట్లరుకును స్టాలినుగారు వ్యత్యాసం చేయుచున్నారు. బ్రిటిషు నాయకులు సరిగా అట్లు తలంచలేదు. కాని స్టాలినుగారు సూచించిన వ్యత్యాసం అట్లాంటికు ప్రణాళిక సూత్రములకు అనుగుణ్యంగావుంది. విజయం పొందినాక రష్యాకూడ తమకు ఎదురు తిరుగుతుందని కొన్ని మిత్రవర్గ దేశాలకుగల అనుమానమును యీ ప్రకటన పోగొట్టగలదు.

ఇంకో ముఖ్య విషయం యేమంటే, సింగపూరు పడిపోగానే జపాను ముఖ్యపట్నమగు టోకియోలోనున్న రష్యా రాయబారి జపాన్ను అభినందించేడన్న జపాను వార్తను రష్యా ఖండించెను. కావున రష్యా ప్రభుత్వం పసిఫికు ప్రాంతముల పరిస్థితుల గమనించుచున్నదేగాని అశ్రద్ధగ నుండలేదనియు, తమ శక్తిచూచుకొని, మిత్రమండలి సహాయబలం చూచుకొని చర్యగైకొనుటకు వేచియున్నదనియు ఎంచవచ్చును.

"ఇండియాలో జన్మించిన బౌద్ధమతం జపానులో పరిపక్వం చెందినది." అని టోకియో రేడియో హిందూస్థానీలో చెప్పుచున్నది. భారతీయులకు జపానువారికి సన్నిహిత సంబంధం

**జపాను బౌద్ధమతం.**

గలదని నచ్చ చెప్పుటకు యిలా ప్రకటిస్తున్నారు. మతం

వేరిటు రాజకీయ ప్రాధాన్యత వహించుటకు శత్రువుచేయు యీ యెత్తును ఎవ్వరెరుంగకపోరు. జపానువారికి బౌద్ధమతంలో ఎంత అభిమానం విశ్వాసంగలదో వారి సైన్యంయొక్క వార్తాపత్రికయగు హెహూచాయందు వ్రాసినదిచూస్తే తెలుస్తుంది. "జపాను చక్రవర్తియే ప్రపంచమంతకు దేవుడని, అది అంగీకరింపని దేశాలు బౌద్ధమత మంగీకరించినట్లు ఎంచ రాదని వేరొక బౌద్ధదేశమున్నదనుట జపాను జాతీయ విధానమునకు విరుద్ధము' ని అందు వ్రాయబడెను. కావున అది జాతీయ విధానమునకు విరుద్ధమయినది. కావున జపాను జాతీయ విధానం ప్రకారం నారి చక్రవర్తి బౌద్ధ మతం అనుసరించువాడు కాడని స్పష్టమగుచున్నది.

**పొరపాటున నిజం చెప్పుట.**

"సింగపూరు పతనం బ్రిటిషు ప్రజలకు మతిభ్రమ కలిగించినను, అది బ్రిటిషు సామ్రాజ్యపతనం కాదు" అని డా॥ గిబ్బెల్సుగారు జర్మను ప్రచురణ శాఖ మంత్రి తన పత్రికలో వ్రాసెను. "బ్రిటిషు సామ్రాజ్యం పదాలంటే, దాని కూకటివేరు తెగగొట్టాలి. అపుడుగాని దాని వివిధశాఖలకు ఆహారం పోయి శక్తి సన్నగిల్లదు. సామ్రాజ్యాలు రోజులు, వారాలు, నెలలలో కూలిపోవు ....." అనికూడ వీరు వ్రాసిరి. డా॥ గిబ్బెల్సుగారు యిట్లు వ్రాయడం వింతగనుంది. ఈతడు తరుచు మన కానందం కలిగించేటట్లు వ్రాయడు. కాని యీ వ్యాసంలో అలవాటు లేకుండా నిజం చెప్పేసెడు. అందుకు అతన్ని కొనియాడవలసియున్నది.

---

# పసిఫికు మహాసముద్ర యుద్ధ వివరములు.

## జావాలో తీవ్రయుద్ధం.

## వావెల్ ఇండియా సేనాధిపత్యం వహించుట.

**జావా యుద్ధం.**

జావా యుద్ధం తీవ్రముగ కొనసాగుచున్నది. జపాను సేనలు ఆ ద్వీపమును అన్నివైపుల చుట్టివేసిన తరువాత 50 నౌకలలో సైనికులను తెచ్చి జావాలో దింపజూచిరి. అంతకుముందే జావాలోని విమానాశ్రయములను వారు బాంబులు వేసి నాశనం చేసిరి. ఇంతలో డచ్చి యుద్ధ నౌకలు, అమెరికను యుద్ధనౌకలు వచ్చి ఎదిరించి శత్రు నౌకాశ్రేణిని చెదరగొట్టినవి. వాటిలో సుమారు మూడవ వంతును ముంచగొట్టిరి. దెబ్బతిన్న జపాను యుద్ధనౌకలు ముందు ఉత్తరానికి పోయి తిరిగి క్రొత్త సేనతోగూడ వచ్చినవి.

జపానీయులు జావా దీవియందు ఉత్తరతీరాన మూడు చోట్ల దిగిరి. మిత్రమండలి విమానాలు యుద్ధనౌకలు ఫిరంగులు ప్రేల్చి వారిని వారించుచుండెను. వారి పడవ లనేకము నాశనము చేసి, నేలదిగినవారిని చంపుచుండిరి. అయినను శత్రు సేనలు దిగుచునేయుండెను. సంయుక్తరాజ్యాలు తిరుగు దాడి ప్రారంభించేలోపల జావాను ఆక్రమించాలని వారి తొందర.

జావాలో మిత్రమండలి సైనిక కేంద్రస్థానం బాండియాంగునందు గలదు. దానికి 40 మైళ్ల ఈశాన్యదిక్కున వున్న సేయబాంగును జపానీయులు వశపరచుకొనిరి. సొరబాయా నౌకాకేంద్రమునకు ముప్పు కలిగించుటకై రాంబాంగునకు 60 మైళ్ల దూరమునందు గూడ జపాను సేనలు దిగినవి. డచ్చి సేనలు మిత్రమండలి సేనలు వారిని నిరోధించుచు క్రొత్తసేనల సహాయం వచ్చువరకు నిలువరించు ని యుండగలవను ధైర్యం కలిగియున్నవి. టిజాపోయందున్న చమురు గనులు శత్రువశం కాకుండా నాశనం చేయబడినవి. జావా కేంద్రస్థానము సైనిక సదుపాయంకొరకు బటావియా నగరం నుండి బాండియాంగునకు మార్చబడింది.

జావాలో పంచమదళం యొక్క ద్రోహం లేదు. డచ్చి సేనలు చివరవరకు నిలువరించుకొనగలవు. ఇంగ్లాండు అమెరికా సేన లాదీవియందున్నవి. అవి వారికి తప్పక సహాయం చేయగలవు. మిత్రమండలికి ఆ దీవియందు ప్రథమ సారి విమానాధిపత్యం లభించింది. చేరువనున్న సుమాత్రా, బాలి దీవులు జపానువశమయినను అచటి గొరిల్లాల నిరోధం ఎక్కువగా ఉన్నందున వాటిని జపానుసేన ఉపయోగించలేక పోయినవి. అందుకే జపాను విమానాలు జావా యుద్ధంలో పాల్గొనలేదు.

**సేనాధిపత్యం మార్పు.**

బ్రిటిషు ప్రభుత్వంవారి ప్రకటనలో పశిఫిక్ సైన్య సేనాధిపత్యం మార్పుగూర్చి యిట్లు ప్రకటించబడింది: మలయాను గోల్పోయి, సుమాత్రాలోనికి జపానువారు వచ్చుటచేత డచ్చి దీవులకును, బర్మాకును లంకె తెగిపోయింది. కావున సంయుక్త రాజ్యాల నేలనౌకావిమాన సైన్యాల నాయకత్వం డచ్చి దీవుల ప్రభుత్వమునకు మార్చుటకు నిశ్చయింపబడెను. సంయుక్తరాజ్యాలకు వీలగునంత సహాయం అంతా వారికి ఒసంగబడును.

"సార్వభౌముని అనుమతిపై జనరలు వావెలుగారు తిరిగి ఇండియా సేనాధిపత్యం వహించెదరు. చీనా తోడ్పాటుతో గూడ బర్మారక్షణ వారి బాధ్యతగనే యుండును. ఈ యేర్పాటువలన జపానుపై యుద్ధచర్యయందు యితర దేశాలతో సహచర్యవిధానమునందు ఎట్టి మార్పు యుండదు."

దక్షిణ పశిఫికునందు వావెలుగారు సేనానాయకత్వం వహించిన తరువాత త్వరలోనే జపానువారు త్రోసుకొని వచ్చిరి. సింగపూరు పడిపోవుటచేత అచటి పరిస్థితులు మారిపోయినవి. ఇక జావాయే మిగిలియున్న ఆఖరు శిబిరం. వావెలు ఆధిపత్యం వహించినపుడు తిరుగుదాడికి ఊతబల్లగనుండగల దనుకున్న జావాదీవి యిపుడు తన్నుతాను రక్షించుకోవలసిన స్థితికి వచ్చింది. ఈదీవి రక్షణ యేర్పాటులన్ని డచ్చివారే చేసియున్నారుకావున సర్వ సేనాధిపత్యం వహింప వారికి హక్కుగలదు. బర్మాకూడ యిపుడు ఇండియా సేనాధిపతి క్రిందకు మార్చబడినందున, పసిఫికు రంగమున సంయుక్త రాజ్యాల రక్షణ బాధ్యత క్రింద ఫిలిప్పైన్సులో నొకభాగం ఆస్ట్రేలియాలో ఉత్తరకొన డార్విక్ ప్రధాన నగరంగాగల కొంత చిన్న భాగం మాత్రమే మిగిలియున్నవి. అందుచే జనరలు వావెలుగారు ఎ.బి.డి.ఎ. (అస్ట్రేలియా, బ్రిటిషు, డచ్చి, ఆస్ట్రేలియా) రక్షణశ్రేణిని విడదీసిరి. అట్లని జావాలో నిరోధమునకు సంయుక్త రాజ్యాలు తోడ్పడవనుకోరాదు. ఇంతకన్న ముఖ్యమగు రంగాలలో అవసరానికి లోటురాకుండా, యిక్కడ ఉంచగల చిన్న

సైన్యాలను, జపానీయులను బాగా కొట్టగలవాటిని, ఉంచి డచ్చివారికి తోడ్పడుచునేయుందరు. అక్కడనున్న బ్రిటిషు శాఖా, సైనిక విమానదళాధిపతులు జావాలోనేయుండి డచ్చి సైన్యానికి తోడ్పడుచుందురు.

జనరలు వావెలుగారు ఇండియా రక్షణకు మిత్రమండలి సైన్యాల తోడ్పాటుతోగూడ యేర్పాటులలో యెక్కువ శ్రద్ధ వహింతురు. జపాను సేనలు ఆస్ట్రేలియా పైకి దాడివెడలుటకు ఇండియాపైకి పూర్తి బలంతో రెండువైపులనుండి నాజీల సహాయంతో దాడివత్తురనిగూడ ఊహించబడుచున్నది. వావెలుగారు వెన్వెంటనే బర్మారక్షణ చూడవలసియున్నది. వారు అన్ని కార్యములందు మార్షలు చాంగ్ కాయి షేకు గారితో కలసి పనిచేయుచుందురు.

**బర్మాయుద్ధం.**

జనరలు వావెలుగారు యిదివరకే డిశంబరులో చీనా ముఖ్యపట్నమగు చుంగుకింగునకు పోయి మార్షలు చాంగ్ కాయి షేకు గారితో అన్ని ప్లానుల గూర్చి చర్చించియున్నందున యిపుడు వారు ఇండియా సేనాధిపతిగ వచ్చుట మరింతలాభకరము. బర్మాయుద్ధం తీవ్ర రూపం దాల్చుచున్నందునను, బర్మా రోడు చెడిపోయేట్లుండుటచేతను చీనా ఇండియాల సమిష్టి చర్య లిపుడెంతయు అవసరం. ఈ బర్మారోడు ఉత్తరాన లాషియోనుంచి భద్రంగా సింగాపూరు దిగువభాగం మూయబడినట్లే. చీనాకు అయుధాలు పోయే ప్రాణప్రదమగు మార్గం యిదే. జపానువారు ఆ ప్రాంతాలలో దాడి చేస్తున్నందున యీ రోడుపై దిగువభాగాన్ని సరకు విమానరక్షణయుంటే కాని పోలేకుండా యుంది.

**మదరాసు వైమానికుల ప్రతిభ.**

ఇంకా సిటాంగునదికి పడమరవైపునే బ్రిటిషు సేనలు ఇండియా సేనలు కలవు. గత వారంలో తిన్న దెబ్బలు సరిచూచుకొని, యింకా జపాను మరల పెద్దదాడి ప్రారంభింపలేకున్నది. ఈ సందర్భంలో భారతీయ వైమానిక దళములు చేసిన ఘన కార్యములు ప్రశంసార్హముగనున్నవి. వారిలో కొందరు ఉద్యోగులు మదరాసువారు ప్రత్యేకప్రశంసను బడసిరి. వావెలుగారే వారిని మెచ్చుకొనిరి. వీరు అమెరికా బ్రిటిషు వైమానికులతో గలసి జపాను వైమానికులను నిరోధించి వారు రంగూను బాంబు చేయకుండాను, వారి నేల సైన్యాలకు సహాయంచేయకుండాను నిరోధించగల్గుచున్నారు.

అట్టియ్యును శత్రుసేనలు రాత్రులందు తప్పించుకొని సిట్టాంగు నది దాటి బ్రిటిషు సైనికులు వచ్చి పడులోపున పెగు నగరానికి ఉత్తరాన బర్మారోడును తెగగొట్టిరి. కావున యిపుడు యీరోడ్డు రక్షణకు చీనావారు 5 డివిజనుల సేనను బర్మాకు పంపిరని తెలియుట ఎంతయు సంతృప్తికరంగా నున్నది. ఈ సేన పరిస్థితులను తారుమారుచేయగలదు.

రష్యానుండి వచ్చేవార్తలు చాల ప్రోత్సాహకరంగా నున్నవి. లెనినుగ్రాడు నగరం చుట్టునున్న జర్మను సేనలపై

**రష్యాలో క్రొత్త విజయాలు.**

ఒత్తిడి ఎక్కువచేసి రష్యా సేనలు 16 వ జర్మను సేనను దాని నాయకుడగు జనరలు వాను బూషుగారిని స్టారయారస్సా వద్ద ముట్టడిచేసి బంధించిరి. అందువలన లెనినగ్రాడు, మాస్కో నగరాల రెండింటి ప్రాంతాలనున్న జర్మను సేనలకు కత్తుకలియక విడదీయబడినవి. ముట్టడియైన 16 వ జర్మను సేనను లొంగిపోమంటే లొంగలేదు కావున వారిని నాశనం చేయుటకు రష్యనులు ప్రయత్నించుచున్నారు. వారికి విమానాలపైనుండిగూడ ఆహారం రాకుండా రష్యనులు నిరోధించుచున్నారు. వారు పారిపోవ యత్నించుచున్నారు. తీవ్ర యుద్ధం జరుగుచున్నది.

స్మోలెంస్కు నగరం తిరిగి వశపరచుకొనుటకు రష్యనులు నెమ్మదిగ ప్రయత్నించుచున్నారు దక్షిణమున ఉక్రైనులో మార్షలు టిమోషెంకోగారు పరిశ్రమల కేంద్రమగు కార్కొవును మధ్యవిడచి, పాలటావైపు దాడి సాగించుచున్నారు. డ్నీపరువరకు జర్మను సైన్యాలను తరిమి వేస్తే ఆతరువాత ఖార్కొవును సులభంగా వశపరచుకొనవచ్చునని వారి యుద్దేశము.

ఇంకా దక్షిణమున క్రైమియానుండి కాకసనుపైకి దుముకాలని జర్మనులు ప్రయత్నించుచున్నందున రష్యనులు ఆ క్రైమియాపైకి బలమైన సైన్యాలను పంపుచున్నారు. వాటికి రష్యనుల యుద్ధసేనలు తోడ్పడుచున్నవి.

---

# వైస్రాయి - మార్షలు చాంగ్ సందేశాలు

ఫిబ్రవరి 21 వ తేదిన ఇండియా దేశపు వైస్రాయిగారికి చీనా సర్వసేనాధికారియగు మార్షలు చాంగ్ కాయి షేకు గారివద్దనుండి యీ దిగువ సందేశం వచ్చింది :—

మేము చీనాకు వెడలిపోవుచున్న యీ సమయమున మీరు లిన్‌లిత్‌గో ప్రభ్వినాకు నాసతికి చూపిన గౌరవమర్యాదల కెంతయు సంతసించితిమని తెలుపగోరుచున్నాము. మేము కొద్దికాలమే యున్నను శత్రు దురాక్రమణ నెదుర్చుటయందు మన రెండు దేశాలకర్తవ్య నిర్ణయం సంతృప్తికరంగా జరిగినందుకు సంతసించుచున్నాను.

“ చీనా ఇండియాల సమిష్టి సైనికచర్యలు నిర్ణయింపబడి పసిఫికు సముద్రమున మన విజయమునకు పునాది వేయబడినందుకు ఆరీతిగ సింగపూరు పోయిన లోటు భర్తిచేసుకొనగల్గినందుకు మరింత సంతోషంగావుంది.

“ సమిష్టి యుద్ధప్రయత్నములకును న్యాయవిరుద్ధ దౌర్జన్యమును త్వరలో అణచివేయుటకును మన రెండు దేశాలు శక్తివంచన లేక కృషిచేయగలవను దృఢనమ్మకంతో నేను ఇండియా విడుచుచున్నాను. ”

వైస్రాయిగారు యీదిగువ రీతి జబాబు పంపిరి :—

మీ సందేశమును నేను మిక్కిలి ఆనందముతో గైకొంటిని. మీ ఉభయుల రాకను నేను లిన్‌లిత్‌గో ప్రభ్వి చిరకాలం ఆనందప్రదంగా జ్ఞాపకముంచుకొందుము.

సైనిక సమిష్టి చర్యల నిర్ణయమునందు దురాక్రమణను నెదుర్కొనుటకు యత్నించుటయందు తగిన ఫలితం చేకూరినందుకు మీ ఆనందమునందు నేనూ పాల్గొనుచున్నాను.

చీనా అనుభవములను బట్టి మీరు ఒసంగిన సలహాలను ఇండియాలో మేము మనస్ఫూర్తిగ గ్రహించెదము. మూర్ఖుడగు శత్రువును యెదిరించుటకు ఐకమత్యం కలిగియుందుము. చీనా సైన్యం శక్తి అంతా మీ నాయకత్వంపై నాధారపడియుంది. ధైర్యస్థులగు చీనా సైనికులతో భుజం కలిపియుందుము. ఏమయినా సరే, జపానుశక్తి పూర్తిగ నాశనమగు వరకు మేము మీతోయుందుము.

“ మీరును మీ భార్యయు యిచట తీరికలేని కార్యక్రమం ముగిసినాక తగు విశ్రాంతిపొందియున్నారను కొందును.”

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.